# ఉప్పుడికొంప

[ నాటికం ]

రామమోహన్

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ - 1.

# ఉప్పుడికొంప

[నాటకం]

రామమోహన్

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ

తొలి కూర్పు
వేయి ప్రతులు
మార్చి 1953
కల్యాణి ప్రెస్
విజయవాడ

వెల : ముప్పావలా



సంపాదకుడు :
గద్దె లింగయ్య

# ఇందులో

| | | | |
|---|---|---|---|
| నారయ్య | వయస్సు 60 సం॥లు. | | ఊరిపెద్ద |
| రాజప్ప | 65 | ,, | ఆస్తిపెత్తందారు |
| రాఘవయ్య | 40 | ,, | రాజప్ప అన్నకొడుకులు |
| భీమారావు | 25 | ,, | |
| పున్నారావు | 22 | ,, | |
| ఆనందం | 15 | ,, | |
| అమరయ్య | 30 | ,, | బంధువు |
| నరసమ్మ | 35 | ,, | రాఘవయ్య భార్యలు |
| సుందరమ్మ | 27 | ,, | |

పాలేరు, కూలీలు.



# ఉమ్మడి కొంప

## ఒకటో రంగం

కాలం : ఉదయం 7 గంటలవేళనుంచి.

ప్రదేశం: ఒక తెలుగుదేశపు పల్లెటూళ్లో.

[బాగా ఒత్తుగా పెరిగి, విస్తరించిన బొగడచెట్టుక్రింద నరసమ్మ నిలబడి వుంటుంది. ఈ బొగడచెట్టు శిధిలమైపోతూన్న ఓ పెద్ద మండువాయింటిముంగిట్లో వుంది. ఇంటిఅరుగులు బెత్తికలూడీ, ఇటికలూడీ అసహ్యంగా వున్నాయి. ఇంటిపెణక సగం కూలిపోయింది. గుమ్మాలు మాత్రం శుభ్రంగా వుండి, మనుష్యులు నివసిస్తున్నారనడానికి గుర్తుగా వున్నాయి. చెట్టుక్రిందమాత్రం చాల పరిశుభ్రంగా వుంది.

చెట్టుకి ఎడమవేపుగా పెద్దమోటనుయ్యి, దానిమీద మొండిగ్గా మోటకాళ్ళు. అక్కడనుంచి కొద్దిదూరంలో కొత్తగా కట్టిన అందమైన రెండంతస్థుల మేడ కనబడుతూంది. నరసమ్మ ఆ మేడవేపేచూస్తూ నిలబడివుంది.

ఆమెకి ముప్పయిఅయిదేళ్ళుంటాయి. గుండ్రని మోటు మొహం. చూడగానే "రణపెంకె రాలుగాయ; దీనితో ఏ మగాడు నెగ్గగలడురా" అని అనిపిస్తుంది.

ఆమె అల్లా నిలబడి చూస్తూండగా ఇంట్లోంచి సుందరమ్మ వస్తుంది. ఆవిడ వయస్సు యిరవైయేడుంటాయి. సన్నగా, పొడుగ్గా వుంటుంది. మనిషి నలుపయినా కన్నూ, ముక్కూ తీరు బాగాన్నే వుంటుంది. మనిషివేపు చూడగానే "మా తెలివిగలది. దేవాంతకురాలులా వుంది" అనిపిస్తుంది.]

సుంద : ఏమిటమ్మా అక్కా! చూస్తున్నావు? పోయి నీళ్లుపోసు
కొని, పిల్లలకి పోసి తయారవు; వస్తారు.

నరస : నా ముచ్చట ముక్కలయినట్లేవుంది. ఇక్కడికి ఇరవయ్యే
ళ్ళాయి కాపురానికి వచ్చా. ఓ ముద్దా, ముక్కలా. ఇది
వుంఎనా, అదిపోయిందనా; ఏమీలేదు. నేను చేసిన చాకిరీకి
కూలి పుచ్చుకుంటే ఒక ఎస్టేటు కొనొచ్చు.

సుంద : (గుమ్మం దిగివచ్చి)ఆడవాళ్ళబ్రతుకే అంతయిపోయింది.
ఆడపిల్లల్ని వదిల్చేసుకొందామనేగాని, అన్నం వుం
టుందా, పిల్ల సుఖపడుతుందా అని ఆలోచనక్కర్లేదు.

నరస : (మేడకేసి చేతులు విసిరి) నా ఉసురు కొట్టుకుపోర్రూ,
వీడికూట్లో మన్నడ!

సుంద : ఆడదాన్ని ఏడిపించి ఎవరు బాగుపడ్డారు? 'కలకంఠకంఠి
కన్నీరొలికిన సిరి యింట నుండనొల్లదు' అని ఊరికే
అన్నారా!

నరస : ఆమాత్రం సరసంకూడానా; అయ్యో—రాత!

సుంద : అందుకే ఇంత బాగుపడుతున్నారు!

నరస : వాళ్ళ కేం లోటు; పోతే మనం పోతాంగాని....

సుంద : ఈవేళ బాగు ఓ బాగా. పైన భగవంతుడు లేడూ చూడ్డా
నికి? (పైకి వేలుచూపుతుంది.)

నరస : ఈరోజుల్లో భగవంతుడుకూడా నోరున్నవాళ్ళపక్షమే.
(విసువుతో) ఈ కుర్రా ళ్ళేమయ్యారో! అన్నంపెట్టి బళ్లోకి
పంపేద్దామంటే....

సుంద : అన్నట్లు చలపతిగాడు జీతం ఇవ్వలేదని పేరు కొట్టేశా డంటున్నాడిందాకా?

నరస : పాడువెధవ! నాతో చెప్పలేదు. జీతం ఇవ్వకపోవడమేం? తెగులా? ఉండు, ముసిలిపీనుగ నడిగొస్తా. (వెళ్ళబో తుంది )

సుంద : (ఆపుతూ) ఉండవమ్మా. కుర్రాణ్ణి అడిగి అసలుసంగ తేమిటో తెలుసుకొని మరీ వెడుదువుగాని....

నరస : (ఉక్రోషంతో) వాడికేం మాయరోగం! వాడి మనమలు చదువుకోడంలేదూ?....

సుంద : వాళ్ళమనమలకేం? నిన్న పొద్దున్న వాళ్ళపెద్దాడి కూతురు లేదూ, ఆ సూరి—అది తన పుస్తకాలు తానే తీసుకొని స్నేహితురాళ్ళతో కలిసి బడికి వెడతానంటూంటే వాళ్ళమ్మ తిట్టింది. అక్కా! ఓ తిట్టుకాదు! ఓ మాట కాదు!

నరస : ఆ! ఏమంటుంది?

సుంద : ఒకటేమిటి? దరిద్రగొట్టుముండ వంది. అనుభవించే యోగం వుండొద్దా అంది.

నరస : ఇంతకీ ఎందుకు?

సుంద : పుస్తకాలు పాలేరు తెచ్చిపెడతాడు, నువ్వు మోసు కెళ్ళొద్దని....

నరస : (తల పంకించి) కాదుమరీ! ఆవిడకేం? అగర్భశ్రీమం తుడి కోడలు! ఉమ్మడి జమీ చేతబట్టుకొని మామగారు నాటకం ఆడుతున్నాడు. ఆవిడ అనుభవిస్తోంది.

సుంద : అనుభవించక తీపుతీసిందా! జరిగినన్నాళ్ళైనాయె.

నరస : జరుగుతుంది, జరుగుతుంది. (నిరాశతో) ఇంతకీ మన అదృష్టంకూడా వుంటుంది. అంతా ముడికాళ్ళ పెద్దమ్మలే అయితే పట్టేదిమాత్రం పడుతుందా?

[ఆనందం వస్తాడు. వయస్సు 15 ఏళ్ళుంటాయి. సంరక్షణ, పోషణ లేక చిక్కి, చింపిరిజుట్టూ, మాసినగుడ్డలతో వుంటాడు. వచ్చి బెదురుతూ అటూ యిటూ చూసి. నెమ్మదిగా ఇంట్లోకి పోబోతాడు]

నరస : ఎక్కడికి నాయనా! ఏంకావాలి?

సుంద : ఏరా, ఎందుకు మావాడిని కొట్టేవుట పొద్దున్నే?

ఆనం : (నిలబడి) నేనేం కొట్టలేదు.

సుంద : జాగ్రత్తరోయ్! కనుక్కొనేవాళ్ళు లేరను....

ఆనం : నేను కొట్టలేదు.

సుంద : ఏరా! అబద్ధాలుకూడానా?

ఆనం : ఎప్పుడమ్మా!

సుంద : (కోపంతో) వెధవబుకాయింపు! ఎప్పుడుట! చెయ్యి నెప్పెట్టి ఇప్పటిదాకా ఏడుస్తూంటే....

నరస : చిన్నపిల్లాడినల్లా కొట్టడం?

ఆనం : కొట్టలేదు వదినా! వాడే కొట్టాడు. నేను చెయ్యి ఇల్లా పెట్టుకు కూర్చుంటే (చతికిలబడి కూర్చుని ఎల్లా కూర్చు న్నదీ చూపిస్తాడు.) వాడొచ్చి నా చేతిమీద గుద్దడం ప్రారంభించేడు. మొదట నెమ్మదిగా కొట్టేడు. ఊరు కొన్నా. మళ్ళీ గుద్దేడు. నెప్పెట్టింది. వద్దన్నా. వినకుండా

మళ్ళీ బలంకొద్దీ గుద్దేడు. నే చెయ్యి తీసేసుకున్నా. పోయి వాడిచెయ్యి రాతిని గుద్దుకొంది. నే కొట్టేనేమిటి? (లేచి నిల్చుంటాడు.)

సుంద : కుఱ్ఱోడు ఏదో చిలిపితనానికి గుద్దితే నెప్పి పుట్టిందేం?

ఆనం : నెప్పెట్టమా!

సుంద : కనుక్కోనే పెద్దవాళ్ళా ఏమన్నానా? వాళ్ళది ఇచ్చారాజ్యం!

ఆనం : నెప్పెడుతుందో లేదో చెయ్యి అక్కడ పెట్టు; నేను గుద్ది చూపిస్తా.

సుంద : గుద్దుతావు! ఈమాటు వాడిని ముట్టుకో, నీ సంగతి చెప్తా.

ఆనం : చెప్తావు! మీవాడిని నాజోలికి రావద్దను.

సుంద : నీజోలి నీ చంకనే వుంచుకో. ముష్టిజోలి ఎవ్వరికీ అక్కర్లేదు.

ఆనం : (వినిపించుకోకుండా) అన్నం పెడతావా వొదినా; బళ్ళోకి పోవాలి.

సుంద : ఔనౌను. ఏమన్నా పెడితే ఓపిక చేరి, మరోమాటు కొట్ట నన్నా కొట్టొచ్చు.

నరస : అన్నం మిగలలేదురా. మీ బాబయ్యకి యీవేళింకా తెలివి రాలేదో, ఏమో, జాంపొద్దెక్కింది. ఇంతవరకు బియ్యం లేదు, ఏమీలేదు. ఓమారు అల్లా వెళ్ళి కనుక్కోరాదు?

ఆనం : (నిరుత్సాహంగా) వెడతా.

[ వెళ్ళిపోతాడు. ]

సుంద : వట్టి చేతగాని చవటనూక! మనఆస్తి ఎవడో తినేసి మనకి పంగనామాలు పెడుతున్నాడు. ఇదేం పోయేగాలంరా

అని అడగాలనే జ్ఞానం పెద్దవాళ్ళకీ లేదు, చిన్నవాళ్ళకీ లేదు, చదువుకోనివాళ్ళకీలేదు; చదువురానివాళ్ళకీ లేదు.

నరస : ఆ చదువు ఎందుకొచ్చిన చదువు. భీమారావూ చదివేడు. ఏమిటోయ్ ఇదంటే, పెద్దవాళ్ళన్నారులే అంటాడు.

సుంద : ఆ నాదిద వో పిచ్చి తిరుక్షౌరం చేసేస్తూంటేకూడా పెద్దాళ్ళేమిటి? ఉన్నదేదో పంచుకోక.

నరస : పంపకాలూ, తెంపకాలుమాట అల్లా వుంచు. ఆ ముసలాడిని పిలక పుచ్చుకొని ఏమిట్రా ఇది అని అడగ్గలిగితే పంచమన్నట్టే........

సుంద : ఈ అప్రయోజకం పెద్దమ్మకి శీనయ్య పిల్ల నిస్తానని కూర్చున్నాడు. అది ఏ జన్మానో జిల్లేడు పువ్వులు పూజ చేసింది. లేకపోతే ఈ వెధవకొంపకి వస్తుందా?

నరస : బాగా చెప్పేవు. దానికి ఏమూలో కాస్త అదృష్టం వుంది. అందుకే ఇంకా ఆ ముడి కాస్తా పడకుండా నిలబడింది.

సుంద : వాటాయి పంపిణీ అయితేగాని, పెళ్ళి చేసుకోనన్నాడుట ఈయనే. పడేబాధ లేవో మనం పడతాం. ఆస్తి వచ్చి, అంతా బాగుండేసరికి ఆవిడ ఇదంతా నా అదృష్టం అని అతిశయం చూపిస్తుంది.

నరస : ఆ, ముందొచ్చిన చెవులకన్న వెనకొచ్చినకొమ్ము లన్న సామెత లేదూ! నే నల్లా వెళ్ళి పిల్లాళ్ళని లాక్కొస్తా.

(వెళుతుంది.)

సుంద: లక్ష్మణుణ్ణి ఇల్లా పంపు. వాడు జ్వరంగా వున్నాడు. వాడికి అన్నం పెట్టొస్తా.

నరస : (తెరలోంచే) బియ్యం ఎప్పుడొస్తాయో! కుర్రవెధవ వుండగలడా?

సుంద: (తెరవేపు నడుస్తూ) ఫరవాలేదు.

నరస : (తెరలోంచే నీ యిష్టమమ్మా.

[అమరయ్య ప్రవేశిస్తాడు. వయస్సు ముప్ఫయిఅయిదుంటాయి. శుభ్రమైన దుస్తులతో దాబుగా వుంటాడు. బాగా ధనవంతుడు, రంగేళీయని స్పష్టంగా తోస్తుంది.]

అమ : సుందరం! (ఇటూ అటూ చూసి) ఎవరూ లేరా?

సుంద : (నెమ్మదిగా) లేరు, బావా!

అమ : నిన్న నే చెప్పింది ఏమాలోచించావు?

సుంద: నా కేం ఆలోచన అక్కర్లేదు. నచ్చింది. అంతకన్న మరోదారి లేదు.

అమ : వాడితో చెప్పు. ఏమీలేదు, ఒక్క పదేళ్ళు కౌలు రానెయ్యమను. ముసలాడిని దేకించేద్దాం. ఎందుకు పంచడో చూడొచ్చు. ఇంత ఆస్తి పెట్టుకొని, శుభ్రమైన చీరన్నా లేకుండా....ఛె....

సుంద: (తన బట్టలవేపు చూసుకొని పెట్టిపుట్టొద్దూ!

అమ : ఆనక అల్లా రా. నాలుగైదుచీరలు తెచ్చి వుంచుతా. నీకు నచ్చింది ఒకటో రెండో తీసుకొందువుగాని....

సుంద: కుర్రాడు అక్కడున్నాడుగాని, కాస్త తీసుకెళ్ళి కాఫీ

ఇప్పించు. రాత్రంతా జరంగా వున్నాడు. ఇంకేం పెట్టింపొద్దు.

అమ : ఏటీ ఎక్కడున్నాడు? నీ కేమన్నా తెచ్చేనా?

సుంద: వద్దు. అవి చూచి కుర్రనాగమ్మ తానూ తింటానని కూర్చుంటాడు.

అమ : పోనీ, ఓ అరగంటకో అల్లా యింటికి రా. మొహమాటం ఎందుకు మేనత్తగారింట్లో. పాలేర్ని పంపి తెప్పించుకో.

సుంద: ఏవో చూస్తాలే.

[ అమరయ్య వెళ్లిపోతాడు. ]

నరస : (లోపలినుంచి) అమరయ్య వెళ్ళిపోయాడా? (వస్తుంది.)

సుంద: ఇప్పుడే; ఏం?

నరస : ఆ ముసలిపీనుగ ఇంకా ఈవేళకి బియ్యం పంపలేదు. ఎప్పుడు చస్తాదో యేమో! ఓమాట పంపమని అమరయ్యతో చెప్తావేమోనని....

సుంద: చెప్తే డబ్బో! ఒకవేళ మంచితనం కొద్దీ పంపినా, ఇంక పేర్లు పెట్టడం ప్రారంభిస్తాడు. ఎందుకు, ఆయన వచ్చాక పంపుతే సరి; ఇస్తాడు. (వెడుతుంది.)

[నరసమ్మ ఇంట్లోకి వెడుతూన్న సుందరమ్మ వెనకాల నవ్వినట్టు కనబడకుండా నవ్వుకుంటుంది.]

నరస : గుడిసేటిముండ!

[ వెళ్ళిపోతుంది. ]

[తెర]

# ఉమ్మడి కొంప

## రెండో రంగం

సమయం : కొద్ది నిమిషాల తర్వాత.

ప్రదేశం : అదే బొగడచెట్టుక్రింద.

[తెర లేచేసరికి వేదిక ఖాళీగానే వుంటుంది. కాని మరుక్షణంలోనే రాఘవయ్య వీధిలోంచి వస్తాడు. మనిషికో నలభయి ఏళ్ళుంటాయి. బక్క పలచగా, పొడుగ్గావుండి కొంచెంవొంగి నడుస్తాడు. బిళ్ళగోచీపెట్టి, పంచె కట్టు,పొడుగుచేతుల లాల్చీ, పైన గోరంచు కండువా వల్లెవాటు. మనిషి డాబుగా దర్పంగా వుంటాడు.

సన్నగా పాట పాడుతూ వస్తాడు ]

రాఘు : చరణరణితమణి
నూపురయా పరి
పూరిత సురతవితానం।
ముఖరవిశృంఖల మేఖలయా
స కచగ్రహ చుంబనదానం॥

[మెట్లు ఎక్కబోతూంటే నరసమ్మ ఎదురు వస్తుంది]

నరస : (కోపం, అసహ్యంతో) వచ్చావు! గుల్లకప్పులు, కూని రాగాలూ నువ్వూ. పొద్దున్నే ఎక్కడికి వెళ్ళావు? ఇంట్లోకి బియ్యం లేకపోతే కుంభం ఎల్లా తోడుతా ననుకున్నావు?

రాఘు : పోవే బ్రాపి పీనుగ! తెల్లవారింది మొదలుకొని నీ వెధవ మొహం చూస్తూ కూర్చోడమేనా యేమిటి పని. మగ పీనుగులకి బోలెడు పనులుంటాయి.

నరస : నీ మగతనం మండినట్లేవుంది. పనిట పని! ఏం చేసు కొచ్చేవేం నిర్వాకం?....

రాఘు : పీడముండవు నువ్వు బతికుండగా ఏ పనేనా జరగ నిస్తావా? ఈపాటి కన్నీ ముగిసి ఇనప్పెట్టి తాళంచెవి వచ్చేది. నీ తొంటకాలు అడ్డంపెట్టి తగలేసేవు. ఇప్పుడు అడ్డమయినవాళ్ళ కాళ్ళూ పట్టుకు ఏడుస్తున్నా.

నరస : కాళ్లు పట్టుకొని ఏడవడంగాకపోతే నీ మొహానికే ఇంత అదృష్టం! జమీందారీకాపురంలో పెత్తనం చేసే పెద్ద రికంకూడాను నీ బతుక్కి. నిన్ను కట్టుకున్నాక కొత్త వెధవముండలా ఇంట్లో కూర్చోక నా మొహానికి ఓ ముద్దు, మురిపెమూనూ....

రాఘు : నీ వెధవతెలివికి ఆశలేం తక్కువలేదు. జాయంటు ఆస్తికి పెత్తనం కావాలట బోడి బాలవెధవ. మా నాన్న గారు పోయిన నాలుగునెలలు చేశావుగా పెత్తనం. దొడ్లో చెత్త చేరుతూందని కాస్తూన్న మామిడితోట కాస్తా నరికించి బల్లలూ, చెక్కలూ చేయించి అమ్మేశావు.

నరస : పచ్చిమామిడికాయలు తిని పసరుచేసి పిల్లలంతా రోగాలే. కొట్టించానో, బ్రతికామో! లేకపోతే ఈ మొహానికి మందుకూడా తెచ్చియిద్దువా?

రాఘ : అందుకేసే నీ తాడుతెగ!

నరస : తథాస్తు!

సుంద: [లోపలినుంచి వచ్చి] ఏమిటక్కా అది!

నరస : ఇదిగో చెప్తున్నా. ఈపూట త్వరగా బియ్యం తెస్తేనే నీకు పిండాకూడు విస్తట్లోకి వస్తుంది.

( వెడుతుంది )

సుంద: ఈపూట ఇంత పొద్దుపోయింది. ఇంతవరకు మేడింటి నుంచి బియ్యం రాలేదు. పోనీ వెళ్ళి ఏ అమరయ్యనేనా అడగరాదూ, ఇస్తాడు.

రాఘ : వాడు ఎందుకిస్తాడే. నీ మొహంచూసి ఇవ్వాలి, మేనత్త కొడుకు కనక.

సుంద: నా మొహంచూసి ఎందుకిస్తాడు? మీ ఆస్తిచూసి ఇవ్వాలి.

రాఘ : ఇప్పుడే కనిపించేడు. కుర్రాణ్ణి తీసుకెడుతున్నాడు. మన వాడు బాగా అలవాటయినట్లున్నాడు. తెగ కబుర్లు చెప్పేస్తున్నాడు.

సుంద: వాడు అన్నం పెట్టమని ఏడుస్తూంటే పంపేను. కాఫీహోటలుకి పోదాం రమ్మంటె వెళ్ళేడు.

రాఘ : ధారాళం అయినవాడు. ఎప్పుడు కాఫీహోటలుకి వెళ్ళినా డబ్బులివ్వనివ్వడు.

సుంద: (చిరునవ్వుతో) ఇవ్వడానికి మీ దగ్గరుండవని అతడికి తెలియదా?

రాఘ : (నిట్టూర్చి, అరుగుమీద చదికిలబడతాడు.) అదీ నిజమే.

సుంద: పోనీ ఓ పని చేస్తే!

రాఘ : ఏ విషయం?

సుంద: మన ఇంటి విషయమే. మన వాటా భూముల్ని అమరయ్యకి ఓ పదేళ్ళు కౌలు కివ్వరాదు? మీ ఆస్తి మీరిస్తారు; మామగారు కాదని అమరయ్యతో పేచీ పెట్టుకోలేరు. ఆవిధంగా ఉమ్మడికాపురం, బియ్యం ఒకళ్ళిస్తేగాని గడవదనుకోవడం అన్నీ పోతాయి. వాడితో ముసలాయన పేచీ పెట్టుకు బ్రతకలేడు.

రాఘ: బాగానేవుంటుంది చేస్తే. కాని,....

సుంద: (సంతోషంతో) అల్లా చెయ్యండి. వాళ్ళ రోగం కుదురుతుంది. రోజురోజుకీ మీ బాబాయిపని మరీ యిదైపోతూంది. మొన్నటికి మొన్న ఏమయిందో ఎరుగుదురా? శివరాత్రినాడు వుపవాసం వుండి, (చేతితో ఎదురుగావున్న నూతిచుట్టూవున్న చెన్నంగి చెట్లు చూపిస్తుంది.) ఈ మన చెట్లవే రెండు బొండాలు తీయడానికి పాలేరుని పంపమని మేడింటికి కబురంపాను. ఒకడుకాదు ఇద్దరుగాదు ముగ్గురుమనుష్యుల్ని పంపించి చెట్లన్నీ మీగడకట్టిన కాయంటూలేకుండా దింపుతీయించి, పట్టించుకెళ్ళేడు.

రాఘ : నీకు ఇవ్వలేదూ?

సుంద: ఉహూం. సాయంకాలందాకా చూశా. ఒక్కకాయ రాలేదు.

ప్రాణం శోషొచ్చినట్లయిపోయింది. అప్పుడు అమరయ్య రెండు బొండాలు పంపాడు కాబట్టి సరిపోయింది కాని—

రాఘ : అమ్మ దొంగవెధవ!

సుంద: ఎందుకు అతన్ని తిడతారు? బొండం పంపినందుకు శిక్ష ఏమిటి?

రాఘ : అమరయ్య నెందు కంటాను? అతడు మహానుభావుడు. మా బాబాయిపీనుగుమాశే....

నరస : (గుమ్మంలోంచి తల ఇవతలపెట్టి) ముండ! ఒక్క అణువు అణిచి ఇదేం పోయేగాలంరా అని అడగలేదు.

రాఘ : నువ్వే మయ్యావు?

నరస : మొగుడుపీనుగువి మొద్దులా ఎదురుగా ఏడుస్తున్నావుగా. నువ్వు చచ్చాక నే నడుగుతా. (వెళ్ళుతుంది.)

సుంద: ఏమిటక్కయ్యా! నువ్వు మరీను. ఏదో పసుపు, కుంకం చల్లగా వుంటేనే మన మొహం చూసేది.

రాఘ : ముసలిముండకి ఆస్తిమీద పెత్తనంపేడుపేగాని, మొగుడు సంగతి పట్టిందా?

సుంద: అబ్బ! మీరన్నా వూరుకొందురూ, ఆవిడతోశేమిటి?

[వొయ్యారంగా వచ్చి ప్రక్కనే క్రింది గుమ్మంలో కూర్చుంది.]

నరస: (తల బయటపెట్టి) నీ శాణాతనం నాకూ తెలుసు. (వెళుతుంది.)

సుంద: (వినిపించుకోదు.) ఇంక ఈ ఉమ్మడికాపురం లాభం లేదు. బ్రతకలేము. ఏదో బయటపడేదారి చూడండి.

రాఘు : (నిరాశతో) మా బావాయనా వడే పట్టి వొంగనక్క పడనివ్వడు, లాభంలేదు.

సుంద: (దీనంగా) ఎల్లాగండీ. పూట కాపూట బియ్యం కొలి చి స్తే ఈ కాపురం ఎన్నాళ్లు. పోనీ అదేనా సరిగ్గా యిస్తు న్నాడా? ఇంకవద్దు. ఆయన మంచిగా పంచకపోతే ఒక్కటే మార్గం. మాట్లాడకుండా అమరయ్యకి భూమి కాస్తా కౌలు రాసిపారెయ్యండి ...

రాఘు : నేనూ అదే ఆలోచిస్తున్నా. కాని, (చెప్పడు)

సుంద: అమరయ్యని నేను బతిమలాడుకొని ఒప్పిస్తా.

రాఘు : నీకెందుకులే ఆ వ్యవహారం. నాకు స్నేహమే. చెప్తే కాదంటాడనుకున్నావేం....అదికాదు. నారయ్యమామే....

సుంద: (సందేహంతో) ఏం, ఏమంటాడు?

రాఘు : ఇప్పుడు పంపకం ఏమిట్రా అంటాడు.

సుంద: ఆయనగారు మొదటినుంచీ అడ్డుపుల్లే వేస్తున్నాడు. ఆయన సలహాకూడాలేకపోతే ముసలాయన ఇంతబరితెగించిపోడు.

రాఘు : పాపం! అత జ్ఞనడం ఎందుకు. ఆయనసలహా కూడా తోసెయ్యడానికి వీల్లేదు.

సుంద: ఆల్లాంటివాళ్ళే మీ సలహాదార్లు....

రాఘు : నీ ఏడుపే నీది.

[నారయ్య వస్తాడు. వయస్సు అరవై పైగా వుంటాయి. పోష ణపోవున్న ఆరోగ్యమైన శరీరం. చలికి జవహర్‌కోటు వేశాడు.]

నార : (నవ్వుతూ) నాకు తెలుసు మీ రిద్దరూ ఏం మాట్లాడుకొంటున్నారో.

రాఘ : (లేచి) రా మామా!

సుంద: (లేచి) రా బాబాయ్.

నార : అరుగుమీ దెందుకులే. ఓ చాప ఇల్లా పడెయ్యి. చెట్టు క్రింద ఈ ఎండపొడలో కూర్చుంటా.

[సుందరమ్మ లోపలికి వెడుతుంది.]

నార : పంపకాలసంగతేనా?

రాఘ : అదే మామా. నువ్వు చెప్పిందే చెప్తున్నా.

[సుందరమ్మ చాప ఒకటి తెచ్చి చెట్టు నానించి పరుస్తుంది. నారయ్య చెట్టుకి జేరబడి కూర్చుంటాడు. రాఘవయ్య ఎదురుగా చాపమీద కూర్చుంటాడు. ఎదుట సుందరమ్మ నిలబడుతుంది.]

నార : ఇదిగోనే పిల్లా! కూర్చుని నే చెప్పేది విను.

సుంద: (కూర్చుండి) కాదు బాబాయ్! కాస్త కాఫీకన్నా గతిలేక పోతే ఈ సంసారం ఏమిటి అనిగాని ....

నార : నీ గొడవ కాఫీకే అయితే, మా యింటికి రా.

సుంద: (నవ్వుతూ) ఇంత ఆస్తి వుండగా మీయింటికి కాఫీకంటూ రావాలి! పోనీ కక్కుర్తికి వచ్చినా నువ్వు కాఫీ ఇస్తావా. మీ యింట్లో 'టీ' యే గాని కాఫీ వుండదు. నాకు కాఫీ అలవాటు.

నార : (సీరియస్‌గా) మాకున్నదేదో ఇవ్వగలం గాని....

రాఘ : (విసుగ్గా) దీనితో వున్న చిక్కు ఇదే మామా! ఏదో ఒకటి సర్దుకుపోదు.

సుంద: మీమాట మరీ బాగుంది. బోలెడంత ఆస్తి పరాయివాళ్ళు తినేస్తూంటే గ్లాసొక టుచ్చుకొని కాఫీకి గుమ్మాలంట బయలుదేరాలి. బలే బాగుంటుంది.

నార : పరాయివా డంటావు; పరాయివా డెవరే. రాజప్ప సయాన మామగారి సహోదరుడే కాదు?

సుంద: సహోదరుడో చట్టుబండలో. నా ఆస్తిలో నాలుగుపైసలు తిననివ్వకపోయాక....

నార : ఇదిగో ఇల్లా విను. సుందరమ్మా! ఈ ఆస్తంతా నీదే నను కొంటున్నావు కాబోలు. [చేయితిప్పి పొలాలూ అవీ చూపుతూ]

సుంద: ఆ. ఎందుక్కాదు? ఈ ఇంటికి కోడలిని నేను. నా కో కొడుకున్నాడు. వాడి కీ ఆస్తిమీద హక్కు లేదంటే పోతుందా?

నార : ఆస్తిమీద అనకు, ఆస్తిలో అను బాగుంటుంది.

సుంద: రెండూ ఒకటే.

నార : ఏమీకాదు. ఇప్ప డింకా ఉమ్మడిలో వుందిగనక నాలుగు వందల ఎకరం కనపడుతూంది గాని, తీరాచేసి పంచేసు కొంటే ఏమిటమ్మా వచ్చేది? మీ నలుగురు అన్నదమ్ము లకీ కలిపి రెండువందల ఎకరాలేగా. మరి ముగ్గురు ఆడ పిల్లలు పెళ్ళికొచ్చేరు, మరిచిపోకు.

సుంద: ఇన్నేళ్ళఆదాయం ముదరా రావద్దా?

నార : అదే లెక్కతీస్తే మీ కొచ్చేది పెద్ద బండిసున్నే. ఉమ్మడి

లోంచి ఏం వొస్తుంది? ఎంత వొస్తుందో అలావుంచు, నీ మరుదులు రేపు శ్రాద్ధఛే పంచమని కూర్చుంటే....

రాఘ : అఘోరించారు. కుర్రపీనుగులు....

నార : ఈపాటికి తగ్గు మరి. ఆస్తి పంచమనడానికి నువ్వు తెచ్చిన వాడాతే వాళ్ళూ తెస్తారు. ఇప్పుడు నీ తరఫున వొచ్చినట్లే వాళ్ళతరఫునీ నేనే తగులడాలి.

సుంద: (ఆలోచనతో) కాదుమరీ.

నార : ఈ రాఘవయ్యగాడు ఏం చేయగలిగినా లేకపోయినా రెండు పెళ్ళిళ్ళుమాత్రం చేసుకున్నాడు. ఆ రోజుల్లో మీ మామ గారు కోడళ్ళిద్దరికీ చెరి పదివేల నగకట్టూ పెట్టాడు. ఆ తూకం బంగారం కాకపోతే మానే, కనీసం ఆ ఖరీదు నగలన్నా మిగిలినవాళ్ళ పెళ్ళాలకి పెట్టాలంటే....

సుంద: ఏముంది పెట్టేటందుకు?

నార : లేకపోతే తప్పుతుందీ. పెళ్ళయిన ఆడపిల్ల లిద్దరికీ యిచ్చినట్లే, ఈ పెళ్ళికావలసిన ముగ్గురాడాళ్ళకీ చెరి పదెకరాలూ వ్రాసివ్వాలి. వాళ్ళకి పెళ్ళిళ్ళు, కార్యాలు కరామత్తులు. ఎలా లేదన్నా ఓ ఆరవై ఎకరాలు అవతల పెట్టు. ఇహ పంచు, ఏం పంచుతావో? చూద్దాం. నీకూ, నీ ఇద్దరు పెళ్ళాలకీ, ముగ్గురు కొడుకులకీ వచ్చే దెంతోయ్, తెలీకడుగుతాను? ఎన్నిమార్లు తిరగేసినా పదహారు ఎకరాలు, నీ ప్రయోజకత్వానికి....

రాఘు: ఏమయ్యోయ్! నన్నంచేనే నొప్పుకోను.

నార : ఆ అభిమానం వున్నా బాగుండిపోను. మొన్నటికి మొన్న పంచాయతీబోర్డు ఎన్నికలకి నీ తమ్ముళ్లే నీకు చెయ్యెత్తలేదు. ఇద్దరు శీనయ్యకి సైయ్య నూరుకొన్నారు.

రాఘు : (గొణుగుతూ) నా యింట్లో నువ్వే నాకు గౌరవం లేకుండా చేశావు. ఆయనగారు ఓ మూల ఇంట్లోకి బియ్యమేనా ఇవ్వకుండా మాడుస్తున్నాడు. పోనీ మా ఆస్తి మాకు పారెయ్యమంటే అదీ చెయ్యడు.

నార : ఎల్లా పంచుతాడు. మైనారిటీ దాటని తమ్ముళ్ళభాగానికి తర్వాత పేచీలు వస్తే ఎవడు పూచీ?

రాఘు : ఇల్లాగే పొడుగునా అడ్డుపుల్లవేశావు.

నార : (కోపంతో) పాడుమాటలాడకు.

రాఘు: (ఆవేశంతో) ఏం అబద్ధమా? రెండువందల ఎకరం భూమి వున్నా కడుపు కింత అన్నం పెట్టలేకపోతే నా మీద గౌరవం ఎవరికుంటుంది? తమ్ముడు చెయ్యి ఎత్తడు. పెళ్ళాం....

సుంద: నే చెప్తే విన్నారా? పదిరూపాయలు పారేసి ఏ కోటా గుడ్డో—నాసిరకం అయితేనేం—తలో చొక్కా కుట్టించి ఇస్తే ఏంచెయ్యమన్నా చేస్తారు. అంతే కాని—ఇప్పుడు బాబయ్యసంటే ఏముంది?....

రాఘు : (కోపంతో) ఈ ముండే లేనిపోనివన్నీ రేపెట్టింది. వాళ్లు వింటూండగా చొక్కాలూ, దీని శ్రాద్ధమూ....

సుంద: నామీపడి ఏడుస్తారేమిటి? వాళ్ళేం చిన్నవాళ్ళా, చితకవాళ్ళా?

నార : మీరిద్దరుముగ్గురూ దెబ్బలాడుకొనే ఇంతవరకు తెచ్చారు. నే చెప్పేదేమన్నా వింటారా?

సుంద: (క్లిష్టంగానే) చెప్పు.

నార : నీ తమ్ముళ్ళకి నీకూ ఎంత సయోధ్య వుందో మొన్నటి పంచాయతీబోర్డు ఎలక్షనులోనే తెలిసిపోయింది. వాళ్లు నీమాట వినరు. తీరా ఆస్తి పంచుకొన్నాక మూడుపూటల్లో కరారావుడికి తెస్తారు. వాళ్ళ స్నేహితులూ అల్లాంటివాళ్ళే పోగయ్యారు. అందరూ పోగడి నీకు....

సుంద: ఏమీ లేందేనే ఈవేళ ఆనందంగాడు మా లక్ష్మిబుజ్జి కొట్టాడు. చెయ్యంతా వాచిపోయింది.

నార : ఔనా సరి. ఇంక ఆస్తికూడా చేతికొచ్చి, కడుపునిండా తిండివుంటే ను వ్వాపగలవా? నిన్నూ, పిల్లల్నీ విరుచుకు తినేస్తారు.

రాఘ : అదే ఇందాకా చెప్తున్నా.

నార : ఇప్పుడు ఆ బాధలేవో రాజప్పమీదతోసుకుపోతాయి. ఇల్లా వుండనివ్వండి. వాడితో చెప్పి, అట్టే గంద్రగోళం రాని వ్వొద్దని చెప్తాను; ఫర్వాలేదు.

సుంద: అయితే ఏదో చెప్పి ఇప్పిస్తూండు. నీ కంటె మా కెవ రున్నారు?

నార : చెప్పాలిచే. పోయొస్తా.

[ లేస్తాడు. ]

సుంద: ఎప్పుడేనా వస్తూండు బాబాయి! కాస్త ధైర్యం. ఈవేళ ఇంతవరకు ఆ ముసలాయన....

రాఘ : బియ్యం పంపలేదుట!

నార : పంపలేదూ. నే కనుక్కొంటా. ఈ వెళ్లేది అల్లాగే వెళ్ళొస్తా.

[ వెడతాడు. ]

సుంద: మీరుకూడా వెళ్లి ఎక్కడో బియ్యం పుట్టించుకురాండి.

రాఘ : ఈయన వెళ్ళేడు. అదేవో తేలనీ. అంతలో అల్లా వెళ్లొస్తా.

[ఇద్దరూ వెడతారు.]

[తెర]



# ఉమ్మడి కొంప

## మూడో రంగం

ప్రదేశం : మేడఇంట్లో గది.

సమయం : ఆదేవేళప్పుడు.

[టేబులు కెదురుగా కుర్చీలో రాజప్ప కూర్చుని విశాలాంధ్ర పత్రిక చదువుతున్నాడు. టేబిలుమీద ఖాళీచేసిన పాలగ్లాసుంది. క్రిందనుంచి మాట వినిపిస్తుంది.]

1 గొంతు: బాబయ్యా లేరా పిన్నీ!

2 గొంతు: ఉండాలి నాయనా! వెళ్ళు.

రాజప్ప : ఎవరువారు?

భీమారావు: (ప్రవేశించి) నేను బాబాయి.

రాజ : (అసంతృప్తిగా) ఏమిటోయ్! పొద్దున్నే వచ్చేవు? రా కూర్చో.

భీమా: (కూర్చుంటూ) మొన్న అడిగిందాన్నిగురించే....

రాజ : (తాపీగా) ఆలోచించేను.

భీమా: ఏం నిశ్చయించేరు?

రాజ : నిశ్చయాని కేముంది? నీదంతా వట్టి చిన్నతనపు టాలోచన.

భీమా: దానిని కాదంటూ మళ్ళీ మొదటినుంచి చెప్పడం నా కిష్టంలేదు. కానీండి [illegible]యం పెట్టాలనుంది.

రాజ : కాని, నువ్వు చేయగలవా, ఏమన్నానా? తీరాచేసి నష్టం పెట్టి కూర్చుంటావు. ఎందుకొచ్చిన సంక్షోభ, తిన్నగా ఇంటిపట్టున ఇంత కలో గంజో త్రాగి కూర్చోక!

భీమా: మీ సలహా మంచిదే అనుకోండి. కాని, అందరికీ అలా కూర్చోవాలనుండదు. అందులో నే నొకణ్ణి.

రాజ : మంచిదే అల్లా వుండడం. పోనీ ఏదో వుద్యోగం....

భీమా: ఇప్పట్లో పిల్లల్నీ, తమ్ముళ్ళనీ వదిలి వెళ్ళదలచుకోలేదు. మరి ఈ వ్యవహారాలు ఏవో చక్కబరచుకొని....

రాజ : అదంతా నీ యిష్టం. ఏదో నా పెత్తనం నాల్రోజులో, వారమో ఉన్నన్నాళ్ళూ చెప్పక తప్పదు, కనక చెప్పాను. మీ యిష్టం మీకు ఇష్టం వున్నా, లేకపోయినా, నాకు సరదా వున్నా, లేకపోయినా వ్యవహారాలు సర్దకా తప్పదు, చెప్పకా తప్పదు.

భీమా: బాగానేవుంది. చెప్పడంలో తప్పేముంది. పెద్దవాళ్లు!

రాజ : నా పెద్దరికమే చెప్పాలి. ఏదో మీది మీకిచ్చి, మాట పడకుండా దాటిపోతే.

భీమా: ఇందులో మాటకేముంది? ఓ యింటివాళ్ళం. ఓ కాని ఎక్కువేమిటి? తక్కువేమిటి?

రాజ : ప్రపంచం వూరుకుంటుందా? పెత్తనం వుండిగనక తగలేశా డంటారు.

భీమా: ప్రపంచాన్ని ఒప్పించగలమా? మనలో మనకి విశ్వాసం వుండాలిగాని....

రాజ : విశ్వాసమే వుంటే ఇల్లా పంపిణీల ఆదుర్దా వుంటుందా? వాడెళ్ళిపోయాడు. నా ఘటం వుండగా ఫలానావాళ్ళు పడక పంచేసుకొన్నారన్నమాట రాకూడదని ఏడుస్తున్నా గాని........

భీమా: అదేం మాటలే? పంచుకొంటూన్నవాళ్ళంతా పడకనే పంచుకొంటున్నారా? ఎవరి సౌకర్యాలు వారివి.

రాజ : సరి. ఇవన్నీ ఎందుకొచ్చిన మాటల్లే. ఎల్లా జరిగే దల్లా జరక్క మానదు.

భీమా: అంతేలే, సరి, నే చెప్పిన మా టేమంటావు?

రాజ : దానిదేముంది? తీసుకో. నల్గురూ యిస్తానన్నట్లే శిస్తు ఇయ్యి.

భీమా: (ఆశ్చర్యంతో) శిస్తు ఎందుకు?

రాజ : ఉమ్మడి ఆస్తిలో భూమి!

భీమా: మా పెరడుదొడ్డికి మేము శిస్తు ఇవ్వడం ఏమిటి?

రాజ : బాగుంది నాయనా, బాగుంది. మీ పెరటిదొడ్డికూడా ఉమ్మడిఆస్తిలో దవునా?

భీమా: అయితే?

రాజ : దానిమీద మీ కెంత హక్కుందో నాకూ అంత హక్కు వుందా? లేదా?

భీమా: రెండేళ్ళక్రితం వంపిణీలలో అది మా వాటాలోకి వచ్చిందిగా ?

రాజ : వచ్చిందయ్యా. వస్తేమాత్రం? ఒకవేళ దానిమీద నాకు

హక్కు లేదని నువ్వన్నా, దానిని నీ ఒక్కడిదీ అన లేనుగా ?

భీమా: నా ఒక్కడిదేనని నేనూ అనలేదుగా ?

రాజ : ఎందుకంటావు ? తెలివైనవా ళ్ళెప్పుడూ నోటితో అనరు.

భీమా: మరి నువ్వా తెలివితక్కువమాట ఎందుకన్నావు ?

రాజ : నా రోజులు బాగులేవు గనక. రేపు ఆ భూమి ఆరేడెక రాల మీద వచ్చిన శిస్తు ఏమయిందని నీ తమ్ముళ్ళే అడుగుతారు.

భీమా: ఇదయినా నాకోసంగాదు. మా అందరికోసమూను. మా వాళ్ళంత తెలివితక్కువవాళ్ళు కాదు.

రాజ : బంధుత్వాలు బంధుత్వాలే. వ్యవహారాలు వ్యవహారాలే. మీ రడక్కపోతే మీ వదిన వుందిగా అడగడానికి. అప్పుడు ఎవ్వరూ మాట్లాడరు.

భీమా: అయితే ఈ రెండేళ్ళనుంచీ పెరట్లో మీరయినా మరమ్మతు చేయించడంలేదు. ఏ పంటా వేయడమూలేదు. అలా వొది లితే నా తమ్ముళ్ళకీ నాకూ సమాధానం....

రాజ : ఏం వొచ్చిందని నేను సమాధానం చెప్పడం ? కానో, రూపాయో ఆదాయం వస్తేకద నే చెప్పవలసివచ్చేది?

భీమా: ఇంతకీ ఏమంటావు ?

రాజ : రేపు వచ్చి నీ తమ్ముళ్ళే పేచీ పెడతారు, దాని ఆదాయం ఏదని ?

భీమా: (కోపంతో) కనక ?

రాజ : (నిర్లక్ష్యంగా) వాళ్ళకి నేను సమాధానం చెప్పుకోనేటం దుకు వీలుగా....

భీమా: వాళ్ళందరినీ మాడ్చి చంపుతూంటే ఎవరికీ సమాధానం ఇవ్వనక్కర్లేదేం?

రాజ : (గంభీరంగా) మీదంతా నోటి వట్టిం. నేనుకూడా నీలాగే....

భీమా: మీ శాంతాన్ని నాకుకూడా నేర్పండి. ఆ పెరట్లోనే పాటి మన్ను తవ్వి ఇటిక తీయించాలనుకుంటున్నారా? పని వాళ్ళున్నారు!

రాజ : తప్పేముంది. మీకు యిల్లు వెయ్యడానికి ఇటిక కావద్దా?

భీమా: మేడింటి దొడ్లోకూడా వుందిగా పాటిమన్ను?

రాజ : ఒకటి, ఇది నా వాటాలోకి వచ్చిన దొడ్డి.

భీమా: (ఎకసక్కెంగా) ఇక్కడ మీ వాటా, మా వాటా తేడా వచ్చిందన్నమాట!

రాజ : (వినిపించుకోకుండా) రెండోది....

భీమా: ఏమిటది?

రాజ : మీ యిల్లు కట్టడానికి ఇటిక అక్కడ తీస్తే మోతకూలి తగ్గుతుంది.

భీమా: అయితే తెలియకడుగుతా బాబాయి, గొయ్యి నూతిప్రక్కన పెట్టి, పడుగంతా మరి నీ దొడ్డికేసి పెట్టిస్తున్నావట. మళ్ళీ దూరం అయిపోదూ?

రాజ : నీరుకోసం నూతికి దగ్గరగా మన్ను తీయమన్నా.

భీమా: ఆ పద్ధతిని. పడుగు బొగడచెట్టు కవతలగా తీయించవచ్చు నుగా, పుంతవేపుకి.

రాజ : మన దొడ్లో పశువుల సావడీ అవీ వేయించాలిగా. ముందు ముందు రెండింటికీ పనికిపస్తుందని అక్కడ పడుగు పెట్టమన్నా.

భీమా: మరి కాల్పు? పుంతలో పెట్టించవూ ?

రాజ : అక్కడైతే మా దొడ్లో బత్తాయిలకి దెబ్బ తగులుతుందే మోనని భయం. అందుకే బొగడచెట్టువెనక కాకుండా పడుగు లోదొడ్లో వెయ్యమన్నది.

భీమా: ఆవం ?

రాజ : కోటివేపు నాల్గయిదు నట్టవలమధ్య రెండు కొబ్బరిచెట్లు చచ్చిపోయాయి. అక్కడ పెట్టిద్దామని.

భీమా: అటూ యిటూ రెండుకొబ్బరి నట్టవలు పోవుగదా?

రాజ : దూడలపాకకి దూలాలకోసం ముందు కోయించేద్దా మనుకొన్నా.

భీమా: అయితే వీటన్నింటికీ మా తమ్ముళ్ళకి సమాధానం చెప్ప నక్కరలేదా?

రాజ : (ఏమీ ఎరగనట్లు) అందరి దూడలకీ కొదట్రా శాలవేయిం చేది?

భీమా: (కోపోద్రేకం తగ్గించుకొంటూ) అయితే మమ్మల్ని వట్టి అమాయకులమనుకొంటున్నావా యేం బాబాయి!

రాజ : ఏం?

భీమా: నీ ధోరణే అల్లా వుంటిలే. ఇంక నువ్వు గుర్రం దిగు. పెద్దమనిషితరహాకోసం ఒరగేసుకుపోతూన్నకొద్దీ మెలికలు వేస్తున్నావే!

రాజ : (విసువుగా)మీరు నా ప్రాణానికి పరమ శత్రువులు. ఎక్కడ దాపరించేర్రా! చావండి. మీయిష్టం వచ్చినట్లు.

భీమా: నీ కా దయ కలుగుతే బ్రతికేపోదుం.

రాజ : నాపని అంతసులువు కాదుగా; చిన్నవాళ్ళసంగతి చూడాలి.

భీమా: పెద్దవాడవయిపోయేప్పు, నీ కెందు కీ తాపత్రయం. రామా కృష్ణా అనుకొంటూ ఓచోట కూర్చోక.

రాజ : నన్ను మూలపెట్టాలనే మీ తాపత్రయం.

భీమా: మూల కాకుంటే వీధిలో కూర్చో. నాకేం? మా వాటా తేవో త్వరగావేసి, తేల్చు. ప్రస్తుతంలో పెరటిదొడ్డి నేను వ్యవసాయానికి తీసుకొంటున్నా.

రాజ : మక్తా?

భీమా: మక్తామాట చెప్తాలే. వెనక తెప్పించిన మోటారు వుండాలి, నాకు దాని నియ్యాలి.

రాజ : (కుర్చీలోంచి లేచి) మోటారులేదు, గీటాయా లేదు. మాయింటి వాడకంనీరు తోడుతూం దది. తియ్యడానికి వీలులేదు.

భీమా: లేకపోతే వ్యవసాయం ఎల్లాగ?

రాజ : ఏంచేసుకొంటావో నాకు తెలియదు.

భీమా: మరి నీకు మక్తా ఎల్లాగ ఇవ్వడం?

రాజ : మక్తా ఇచ్చేస్తావనే అనుకొంటున్నానా?

భీమా: నా వాటాలోంచి తగ్గించుకోందువుగాని, ఆ మోటారు పడెయ్యి. ఏదో పిల్లలూ మేమూ ఇంత తిండి తింటాం.
రాజ : ఇప్పుడు తినడంలేదని ఒక అప్రతిష్ఠకూడానా నాకు.
భీమా: అందరూ ఎరిగినదానికి ప్రతిష్ఠేమిటి? అప్రతిష్ఠేమిటి? నేను మోటారు తీసుకొనేదే.

[ లేచి గుమ్మంవరకు వెళతాడు. ]

రాజ : (అడుగు పెదవి కరిచిపట్టి) ఈ వ్యవహారం పెద్దాడికి తెలుసా? వాడు ఒప్పుకోనిదే నువ్వదొడ్డి తీసుకోడానికిలేదు.
భీమా: [వెనక్కి తిరిగి] ఎందుకో?
రాజ : ఇంటికి పెద్దవాడు..
భీమా: (నిర్లక్ష్యంగా) అందరికీ పెద్దవు నువ్వున్నావుగా....
రాజ : మళ్ళీ చెప్పలేదనుకోకు. మీ అన్నను పంపు. వాడితో యేర్పాటుచేయాలి.
భీమా. (మంటగా) మళ్ళీ చెప్పలేదనుకోకు. ఆ పెరటివిషయం. మోటారువిషయం మెలికేశావంటే....
రాజ : (అదిరిపడి) యేం, బెదిరిస్తున్నావా ?
భీమా: పెద్ద బెదిరింపు కావాలా యేం. ఇంక ఓపిక్కికూడా హద్దుందని చెప్తున్నా.

[ వెడతాడు ]

రాజ : (అతడు వెళ్ళినవేపే చూస్తూ) వ్యవహారం ఎంతవరకు వచ్చిందిః నేనూ చూస్తా!

[తెర]

# ఉమ్మడి కొంప

## నాలుగో రంగం

ప్రదేశం : రెండోరంగంలోని చోటనే.

సమయం : రెండో రంగం ముగిసిన కొద్ది క్షణాలకే.

[ నరసమ్మ గుమ్మంలోకి వచ్చి అటూ యిటూ చూస్తూవుంది. నెమ్మదిగా అమనులో అడుగు వేసుకుంటూ పున్నారావు వస్తాడు. వయస్సు ఇరవై రెండుంటాయి, అతి సాధారణమైన దుస్తులు. ముఖం చూడగానే చాలా సాత్వికుడనిపిస్తుంది.]

నర : పున్నయ్యా !

పున్నా: ఏమి వొదినా! ఇంకా మడికట్టుకోనేలేదా? అప్పుడే తొమ్మిది దాటిందమ్మా.

నర : మీ బాబాయిపెత్తనం మరో నాల్రోజులు సాగితే నే వొండక్కర్లేదు; నువ్వు తినక్కర్లేదు.

పున్నా: చెల్లాయిలు, తమ్ముడు కాలుకాలిన పిల్లుల్లా తిరుగుతున్నారు. పాపం మాణిక్యం ఆకలంటూంది.

నర : నేనేం చేసేది బాబూ! ఇంట్లో బియ్యం ఒక్కగింజ లేదు. ఇంక మీరూ పెద్దవాళ్ళయ్యారు. ఏదో కనుక్కోకపోతే ఎట్లాగోయ్.

పున్నా: అన్నయ్య ఏదో చేస్తూంటే మధ్యన మేం కలగచేసుకోవడం ఏం భావ్యం వొదినా?

నరస : అయ్యో! సంబరం! మీ అన్నయ్యో ఓ మనిషే. తప్పుడూ ఓ రోష్టే. ఆయనగారు నారయ్య ఇంట్లో టిఫిన్లుకొట్టి, ఆకలేస్తున్న పిల్లలకి సుద్దులు చెప్తాడు.

పున్నా : చిన్నన్నయ్య పొలం వ్యవసాయం పెట్టుకొందాం అంటు న్నాడు. అది ఓ కొలిక్కి వచ్చినా ఈ ఇబ్బంది లేక పోవును.

నరస : ఆ! ఆయనగారు వ్యవసాయం చెయ్యకేం. అదిగాక మీ అన్నదమ్ములందరికీ తలోకాస్త కొంచెవెర్రివుంది. బోలెడా స్తుంది. కాలుమీద కాలేసుకొని తినడానికుంది. సంభా ళించుకోలేక ఓ ముసలినక్కచేతిలో పెట్టి, మీరు వ్యవ సాయం చేసుకొంటామంటారేం కర్మమోయ్!

పున్నా : ఆస్తంటేమాత్రం వ్యవసాయం చేసుకోకూడదా?

నరస : బాగుంది, నాయనా బాగుంది. మీరు వ్యవసాయం చేస్తారు. పండిస్తారు. నేను తింటాను. కడుపు నిండింది. కాని ఈ పూట మాటేమిటి?

పున్నా : వెళ్ళి కనుక్కుంటా.

నరస : మెత్తగా కనుక్కుంటానంటే ఆయన యిస్తాడా?

పున్నా : గుమ్మంలో అభోజనం కూర్చునేనా తెస్తాగాని వదులుతానా వదినా?

నరస : అభోజనం వుండక ఇప్పుడు అన్నమే తిన్నావా?

పున్నా : ఏం?

నరస : ఎక్కడో వెర్రిమాలోకంలా వున్నావు. మిమ్మల్నందర్నీ

ఆ భోజనం వుంచడానికే ఆయనగారి ఏర్పాటు. ఇక్కడుం డేవి అక్కడుంటావు. అంతేగా తేడా. ఆయనగారి వేమి కఎలిక పుట్టదు.

పున్నా: ఏంచెయ్యమంటావు మరి?

నరస: అల్లా అడుగు చెప్తా. పిలకచ్చుకొని యీడించి, రెండు లెంపలూ వాయగొట్టు. పశువువాడికి నేను చెప్పాలా? అయ్యో!

పున్నా: అదేమిటోయి నా! పెద్దవాణ్ణి కొట్టమంటావు?

నరస: బాగుందీ నాయనా! బాగుంది. పోయి ముద్దెట్టుకో.

పున్నా: అయితే ఎవడో బూతులు తిట్టేడని కొడితే, మరి అప్పుడు ఆనందా న్నెందుకు కొట్టేవు?

నరస: ఇంకా జ్ఞాపకం వుందీ?

పున్నా: మరిచిపోలేదు.

నరస: అక్కర్లేనివన్నీ మీకు జ్ఞాపకమే. ఎవడో కుర్రపేనుగ బూతులు తిట్టడం. ఈ ముసిలాడు ముద్దీ ఎండగట్టడం ఒకటేనా?

పున్నా: సరిలే.

నరస: కాకపోతే!

పున్నా: ఆయనగార్ని కొట్టడానికి నాకు చేతులు రావు సుమా!

నరస: మరేం చెయ్యగలవు? నే చెప్తున్నా. పునిస్త్రీ మాత్రుడు వుని. (చెట్టు క్రిందికి నడిచి) పదా చెట్టుకిరటా. వినబడి... చెప్తున్నా. మీ బాబాయి పెత్తనం పోతే తిప్పలు తప్పవు.

తిండి తిననిప్పడు. అభోజనం వుండండి, చావండి; అది అంతే.

పున్నా: అయితే మన వాటా మన కిచ్చేనేదాకా అయనగుమ్మం లోనే అభోజనం వుంటా. ఎందుకివ్వడో చూస్తాగా....
(వెడతాడు)

నరస: వెడుతున్న పున్నారావు నుద్దేశించి) వాటా ఏం చేస్తావు? తాళంచెవులు— కొట్టుగదివీ, ఇనప్పెట్టివీ— తాళంచెవులు.... (పున్నారావు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.) ఓరి— పెర్రి పీ-నుగు-ల్లారా!

[ సుందరమ్మ వస్తుంది. ]

సుంద: ఏం చేస్తున్నావక్కా!

నరస : (నిరాశతో) ఏముందమ్మా చెయ్యడానికి? సంతోషిస్తున్నా! మా నాన్న నన్ను చంపలేక ఈ వెధవకొంపలో పడేసేడు. ఆ ముసిలిపీనుగ తెలివికి 'దేవుడా' యని ఏడుస్తున్నా.

సుంద: ఇప్పు డేం అనుకొని ఏం లాభం?

అమరయ్య: (వచ్చి, చేతిలో వున్న బియ్యపుసంచి క్రింద పెడ తాడు) రాఘవయ్యా బియ్యం లేవనుకొన్నాడు. ఈమధ్యన యింట్లో ఆడాళ్ల లేరుగా. నేనూ, అమ్మేగనక ఏదో అశ్రద్ధ అయింది. బియ్యం మరకి పోయించలేదు. అప్పటివే ఓ కుంచెడుంటే తెచ్చాను.

సుంద: మీకు శ్రమ ఇచ్చేరు.

నరస : బియ్యం మీరు తేవాలా? సుందరి ఏదో కావాలనుకొం టూంది. అదే వచ్చును, పాపం! నీకు శ్రమ.

అమ : (సిగ్గుపడి సుందరమ్మ ముఖంవంక చూస్తాడు.) పాపం ఇంతోటిదానికీ అది రావాలా?

నరస : కూర్చోండి. బియ్యం లోపలపెట్టి వస్తా.

అమ : బియ్యం కేవు పట్టిందేమో, కాస్త దాచి మరీ ఎసట్లో వెయ్యండి.

నరస : అల్లాగే. (వెడుతుంది)

అమ : (ఆమె వెళ్ళేవరకూ ఆగి) ఇదిగో, స్నో. తీసి దాచు. (పాకెట్టు జేబులోంచి స్నోబుడ్డి తీసి సుందరమ్మ చేతి కిస్తాడు.)

సుంద: ఇప్పుడెందుకు తెచ్చావు. (తీసుకొంటుంది.)

అమ : (లోపలికి కన్నుగీటుతూ) ఈ ముండకి తెలుసునేమిటి?

సుంద: (బెదురుతూ) పాముచెవులు. దొంగముండ పసికట్టేసింది! నువ్వు వెళ్లు, తర్వాత చెప్తా.

అమ : ఏవో భూములు, కౌళ్లు అంటూ ఎత్తేడు. నువ్వేమన్నా చెప్పేవా?

సుంద: ఇందాకా అన్నా, నువ్వు ఏమన్నావు?

అమ : విని ఊరుకొన్నా. ఏం చెప్పలేదు.

సుంద: త్వరగా వ్రాయించుకో. మా మరుదులు వ్యవసాయం పెడతామని తంపి తెస్తున్నారు.

అమ : వ్యవసాయం ఏమిటి?

సుంద: ఇప్పుడు కాదు. ఇక్కడా కాదు. వెళ్ళు, వీలుచూసుకొని వచ్చిచెప్తా. అత్తయ్యిందా?

అమ : సాయంకాలం బండికి చెల్లాయిగారింటికి వెడతా నంటోంది.
సుంద: ఓమాటు వస్తా.

[అమరయ్య వెళ్ళిపోతాడు. సుందరమ్మ ఓ నిమిషం నిలబడి ఇం ట్లోకి పోబోతూంటే భీమారావు వస్తాడు.]

భీమా: వదినా!

సుంద: (వెనక్కి తిరుగుతుంది.)

భీమా: ఈవేళ ఇంకా బాబయ్య బియ్యం పంపలేదని విని శీనయ్య మామ రెండూ, సోమయ్యబావ రెండూ అరటిగెలలు పంపుతున్నారు. వొద్దన్నా వినలేదు.

సుంద: కట్నంతో పిల్ల వస్తుందని సోమయ్యా, కట్నం అక్కర్లే కుండా అల్లుడొస్తాడని శీనయ్యా గేలం వేస్తున్నారు. అరటిపళ్ళతో ఆస్తికి ముడెట్టేరన్నమాట!

భీమా: అదేమ్మాట వదినా. అరటిపళ్ళతో పెళ్ళిళ్ళయిపోయేటట్లయితే ఈ ఇబ్బందులేవీ వుండవు.

సుంద: ఏమోనయ్యా! పుట్టిపుణ్యాన ఎవరికన్నా, ఏదన్నా వస్తు విస్తారంటే ఎల్లా నమ్మడం?

భీమా: పోనీ ఆశతోనే ఇస్తున్నారను. ఏమయితేనేం పిల్లలకి ఈపూట కాస్త ఫలహారమిచ్చారు. ఇంకా బియ్యం రాలేదుగా.

సుంద: లేదు.

భీమా: చెల్లాయిలూ, తమ్ముళ్ళూ, అప్పాయి - అరుగో అక్కడ ఆడుకొంటున్నారులే - ఇల్లా పంపెంచి నే నల్లా మేడిం

టికి పోయొస్తా. శీనయ్యగారి పాలేరు ఇప్పుడా వస్తాడు. గెలలు ఇంట్లో పెట్టించి. పిల్లలందరికీ తలో రెండూ ఇవ్వు.

సుంద: అల్లాగేలే; లక్ష్మణుడికో చెప్పకు, వాడికి వొంట్లో ఇదిగా లేదు.

భీమా: సరేలే, నే వెడతాను: ఏం జ్వరంగా వున్నాడా?

[వెనకవేపునుంచి నారయ్య వస్తాడు. మనిషి ఆవేశంలో వుంటాడు.]

సుంద: ఇల్లా వచ్చేవు బాబాయ్!

[ఆ పలకరింపు విని భీమారావు అగి వెనక్కి తిరిగి చూస్తాడు.]

భీమా: ఇల్లా వచ్చేరు?

నార : ఏదోయ్ మీ అన్నగారు?

భీమా: నే చూడలేదు.

సుంద: ఇంకా రాలేదు బాబాయ్! ఇంటికి.

నార : ఏమిటోయ్, ఈ వ్యవహారం అంతా? మీ పున్నయ్య తంతేమిటి?

భీమా: పున్నయ్యేమిటి?

నార : మీకెవళ్ళకూ తెలియకుండానే ఇదంతా జరుగుతూందంటే నమ్మమనేనా? ఏమిటే రగడ?

భీమా: ఆ రగడ ఏమిటో, పున్నయ్య ఏం చేశాడో చెప్పకుండా మీ హడావిడేమిటి?

నార : ఆస్తి పంచుతావా, పంచపాయని రాజప్ప వంటింటో కూర్చొని అభోజనం వుంటానంటున్నాడు. ఏమిటీ యాగీ?

భీమా: ఒకటి చెప్తారా?

నార : ముందు అతడిని పిలు.

భీమా: ముం దిది చెప్పండి. నిన్నరాత్రి పొద్దుపోయేవరకూ ఈ విషయంమీద మీతో మాట్లాడా.

నార : దానికీ దీనికీ ముడేమిటి?

భీమా: మీరేం చెప్పారు? మీయింటి వ్యవహారాలతో నాకేం సంబంధం? మీరూ మీరూ పంచుకోండి! దిగమారండి అని సలహా యిచ్చారు.

నార : అయితే?

భీమా: మేం పంచుకొంటాం; దిగమారుతాం. మీ రేమీ కలగచేసుకో నక్కర్లేదు.

నార : ఊరికి ప్రెసిడెంటునై వుండి ఇల్లాంటి ఘోరాలు జరుగుతూంటే....

భీమా: ఇదేం ఘోరంకాదు. ఎవ్వడిబాబుగారి సొత్తునూ మేం కోరడంలేదు. మాది మా కివ్వమంటున్నాం. పెద్దమనిషివి కదాయని చెప్తుతుంటే....

నార : నా పెద్దరికం తగులబడ్డట్టేవుంది.

భీమా: అదే నే చెప్పేదీ.

నార : ఏమిటీ!

సుంద: భీమన్నా! అదేమిటోయ్!

నార : చూశావుచే ఈ వుండాకోరు.

భీమా: కానీ, కానీ (వెళ్ళిపోతాడు)

నార : (కోపంతో వాజికిపోతూ) ఉప్పిళ్లూ, ఉపవాసాలూ చేసి వ్యవహారం చేద్దామనుకొంటున్నారు. దీనివెనక హంస ఎవరో అందరికీ తెలుసు. శీనయ్యగాడు ఆడిస్తున్నా డంతా. అరటిగెలలు పంపడం, ఆ అంటకాగడం అన్నీ నాకు తెలుసు.

సుంద: (ఏమీ ఎరగనట్టు) అరటిగెలలేమిటి?

నార : శీనయ్యగాడు అరటిగెలలు రెండు పాలేరుచేత పంపుతూంటే కంటబడ్డాయి. ఎక్కడికిరా అంటే పెద్దింటి కన్నాడు. పట్టెడేసి పళ్ళు, నిలువుదేసి గెలలు. కుర్రాళ్లు ఆకలిపదున్ని తింటే ఇంకేమన్నా వుందా? నజ్జుచేసి మంచాన పడిపోరూ. నీకొడుకుకూడా అలావున్నాడన్నావు! పాలేర్ని కొప్పడి మేడింట్లో పెట్టించమన్నాను. పిల్లలందరికీ తలోకాయ జాగ్రత్తగా చూసి యివ్వమన్నా. వాడికి ఈ అభోజనం వుండడం అవీ తెలియవనేనా? ఇంట్లో కలహాలు రేపెడతాడా తుంటరి!

[వెళ్ళిపోతాడు.]

[సుందరమ్మ విస్తుపోయి నిలబడి యింట్లోకి పోతుంది. ఆవెంటనే భీమారావు ఆనందాన్ని వెంటపెట్టుకొని వస్తాడు.]

భీమా: వాడినా!

[ఇంట్లోంచి నరసమ్మ, సుందరమ్మ ఒక్కమారే ఈవలకి వస్తారు.]

భీమా: శీనయ్యగారి పాలేరు రాలేదూ?

సుంద: ఇంకేం వస్తాడు?

నరస : అరటిగెలలు చూసేసరికి కళ్ళుకుట్టి మీ బాబాయి ఇంట్లో పెట్టించుకొన్నాడు.

భీమా: ఆయన ఇంట్లో పెట్టించుకోవడం ఏమిటి?

నరస : మీ తెలివికి సమాధానం నన్నడిగితే ఆడ పీనుగుని నేనేం చెప్తాను? రౌతుచేవకొద్దీ గుర్రం. (ఇంట్లోకివెళ్ళిపోతుంది)

భీమా: ఇదేదో చాలా ముదురుతూంది. దీని అంతు కనుక్కోందే వదలకూడదు.

ఆనం : రెండుతన్ని మన గెలలు మనం తెచ్చుకుందాం పద.

సుంద: గొడవ లెందుకు పోనివ్వండి.

ఆనం : (నిక్కిచూసి ఆదుర్దాతో) అన్నయ్యా, అన్నయ్యా! అల్లా చూడు. బాబయ్యగారి పాలేరు అరటి చురుగుతో ఏదో తీసుకెడుతున్నాడు.

భీమా: (చూసి, ఆవేశంతో) అరిటిగెలే.

సుంద: పెద్దవీధికి మళ్ళేడు. నారయ్యగారికి నజరానా వెడుతూంటి కాబోలు.

భీమా: అందుకేనా అన్ని శ్రీరంగనీతులు చెప్పేడు. (అటూ యిటూ చూచి అరుగుమీద వున్న కర్ర తీస్తాడు.)

సుంద: (ఆదుర్దాగా) ఆ కర్రెందుకు? అల్లా పడెయ్యి.

భీమా: ఈవేళ దీనిసంగతి తేల్చిపారేస్తా. ఈ నాటకం ఈవేళతో ఆఖరుకావాలి. (మహావేశంతో పరుగెత్తుతాడు.)

ఆనం: (అటూ యిటూ చూసి) నేమా వెడతా. (క్రిందపడున్న రాళ్ళు రెండు తీసుకొని పరుగెత్తుతాడు)

నరస: (లోపలినుంచి ఆదుర్దాగా వచ్చి) ఏమిటీ గంద్రగోళం?

సుంద: భీమారావు ఎవడ్నో చంపేస్తాడు. కర్ర తీసుకొని పరుగెత్తుకెళ్ళేడు.

నరస : ఎవర్ని చంపుతాడు?

సుంద: వాళ్ళ బాబయ్యని అక్కా! ఆస్తి పంచనందుకు చంపేస్తాడు! (ఏడుస్తూ వెళ్ళిపోతుంది.)

నరస : శని వొదిలిపోతుంది. (వెడుతుంది.)

[తెర]



# ఉమ్మడికొంప

## ఐదో రంగం

సమయం : మరో పది నిమిషాల తర్వాత.
ప్రదేశం : అదే బొగడచెట్టుక్రింద.

వెంకన్న: (అరటిగెలలతో హడావిడిగా వచ్చి అరుగుమీద గెల పెడతాడు.) అమ్మగారూ! అమ్మగారూ!

నరస : (వచ్చి) ఏమిరా?

సుంద: (వచ్చి) గెలేమిట్రా?

వెంక: భీమయ్యబాబు ఇచ్చి రమ్మన్నారండి. చూసుకోండి. (పోతాడు.)

నరస : ఆయన ఏం చేస్తున్నార్రా?

సుంద: వాడెక్కడున్నాడు?

నరస: (చొరుగు తప్పించి ఓ పండు తీస్తుంది.) ఓహో ఏం పళ్లు. (సుందరమ్మకు ఇవ్వబోతుంది.)

సుంద: (చూడనట్లు పుచ్చుకోకుండా తాను ఒక పండు తీస్తుంది.) చెట్టున ముగ్గినపండు!

[రాఘవయ్య ఆందోళనగా వస్తాడు.]

రాఘ: ఏమిట్రా ఈ అల్లరి?

నరస : అల్లరేమిటి? చుక్క కూడా అలవాటు చేశావా?

రాఘ : పోవే దౌర్భాగ్యముండా! నువ్వే అల్లరికి మూలం.

నరస : గింజుకు చావు. (గెలను ఇంట్లోకి ఈడవబోతుంది.) రావే ఇంట్లో పడేద్దాం.

రాఘ • అదెక్కడదది? ఏదీ అరటిపండేదీ?

నరస : తగులడు (ఒక పండు ఇవ్వబోతుంది. రాఘవయ్య ఆమెను నెట్టివేసి తానే ఒక పండు తీసుకుంటాడు.)

రాఘ : పళ్లు బాగున్నాయి. ఇది మనగదిలో పెట్టండి.

నరస : వీలులేదు. నువ్వే మట్టివిఘ్నేశ్వరుడులా మింగేస్తావు. నీ గదిలో వుంచడానికి వీల్లేదు.

రాఘ : పోవే పింజారిముండా! జాగ్రత్త. వీపు చిట్లగొట్టేస్తా; తప్పుకో.

నరస : నీ మొహంఽ సంతకెళ్ళిరి, ఈ ఇంటికి పెద్దకోడలిని నేను. మామగారూ, అత్తగారూ చచ్చిపోయేటప్పుడు ఇల్లంతా నాకు వప్పజెప్పిపోయారు.

రాఘ : కోడ లెప్పుడూ ఇంట్లో ఏడవాలి. వీధిలో దెబ్బలాడ కూడదు. (మెడబట్టి నెట్టేస్తాడు.)

నరస : నీచేతులు పడిపోను! ఏ ప్రయోజకత్వం లేకపోయినా, ఆడదానిమీద ఎగరడానికి వుంది. (వెడుతుంది.)

సుంద: తేండి. ఇది నాగదిలో పడేసి జాగ్రత్త పెడతా.

రాఘ : ఏమేవ్ నేను నీ మొగుణ్ణి. ఇది నా గదికి రావలసిందే.

సుంద: మొగుడూ, మొద్దులూ, అన్నమేనా పెట్టలేవుగాని. ఇది నా గదికే.

రాఘ : అన్నీ నువ్వే మింగేద్దామనా. అదేమీ కుదరదు.
సుంద: నా కొక్కటీ దక్కకుండా. చేద్దామని. నే ఒప్పుకోను.
నరస : (తలుపునుంచి తల ఈవలపెట్టి) ఇద్దరూ కలిసి దీన్ని మింగేద్దామనుకుంటున్నారు పీనుగులు. మీ ఆటలు సాగనివ్వను. (వెడుతుంది.)

రాఘ : ఏమే! నాగదిలోకి పడతావా పట్టవా? (ఓపండు విరుస్తాడు.)
సుంద: నా గదిలోకి పడితేనే. (రెండుపళ్ళు విరుస్తుంది.)
నరస : (వచ్చి) ఈ గెల నాది. (మరోపండు విరుస్తుంది.)
నార : (హడావిడిగా వచ్చి) ఈ గెలని రాజప్ప మాయింటికి పంపేడు. గుమ్మంలోంచి భీమయ్య ఎత్తుకొచ్చేడు. ఇది నాది. మీకేంవచ్చిందర్రా, నా ఆస్తి మీరు మింగేస్తున్నారు. (చేతుల్లోపళ్ళు లాక్కుంటాడు.)

రాఘ : నీవయితే నువ్వే పుచ్చుకో. (ఇచ్చేస్తాడు.)
సుంద: ఇవి నీవనే జాగ్రత్తపెట్టిపంపుదామనుకొంటూంటే ఈయన గారు (రాఘయ్యకేసి చూపించి) తినేస్తానని కూర్చున్నాడు. (ఇచ్చేస్తుంది.)
నార : (ఇటూ అటూచూసి, నరసమ్మ చేతినుంచి లాక్కోవడానికి సాహసించడు) పోనీ. ఎంత మనసుగావుందో. నువ్వే తీసుకో.
నరస : (కోపంతో) వెధవపండు! నా కక్కర్లేదు. నువ్వే తగులడు. (పండు పారేసి వెళ్ళిపోతుంది.)
నార : (నరసమ్మకేసి చూపిస్తూ) కోపిష్టిది కాని, చాల గౌరవస్తు

రాలు. అస్తమానం కొట్టుకుచావకపోతే కలిసికట్టుగా వుండరాదు?

రాఘ : ఆ ముండది పంకుపట్టు. తనమాటే చెల్లాలనేడుస్తుంది. సుందరం ఇలా కాదు.

నార : దీనితోమాత్రం నీకు పొత్తు ఏడిసిందా?

రాఘ : ఇదస్తమానం జేబులు తడుముతూంటే నే నెక్కడచావను.

సుంద: ఓ ముద్దనిలేదు. మురిపెం లేదు. 'స్నో' కావాలంటే అమరయ్యగారి కొట్టునుంచి అరువు ఏడవాలి.

రాఘ : స్నోలకనీ, నీ శ్రాద్ధానికనీ ఆ అమరయ్యగాడికి ఇల్లంతా కడిగిపెట్టేస్తున్నావు. పాడుముండా! ఈ మాటు ఇల్లు కదులు చెప్తా.

సుంద: (నిరసనగా) ఇదే పతకమైతే అమ్మకు బతకలేకపోదునా అందట. (చీదరించుకు వెళ్ళిపోతుంది.)

రాఘ : (నారయ్యతో) ఈ ముండలతో వేగలేను. నాకు మరో పిల్లని చూసిపెట్టు.

నార : (అసహ్యంతో) ఇక్కడికి వీళ్ళ నేడిశావు, ఇంకో పెళ్లి! ఇప్పుడీ గొడవేమిటో ఏమన్నా కనుక్కున్నావా?

రాఘ: (చప్పరించేసి) గొడవాలేదు, గంద్రగోళంలేదు.

[ రాజప్ప హడావిడిగా ఏడ్పుమొహంపెట్టుకొని పరుగెత్తుకొస్తాడు.]

రాజ : (విసుక్కుంటూ) ఈ పాడు పంపిణీ ఏదో తేల్చిపారెయ్యకపోతే బతికే దారిలేదు.

రాఘు : విన్నేవరూ పంచమనందే.

రాజ : నీ మాటకో విలువ! ఆ కు|్రపీనుగులంతా ఇంటిమీద పడి పోయారు. నారప్పా! ఇదేదో తేల్చెయ్యకపోతే నన్ను చంపేసేలా వున్నారు.

నార : ఏం పర్వాలేదు. వాళ్ళకి ఈపూట బియ్యం పారెయ్యి. పోతారు.

రాజ : బియ్యం కాదయ్యా బాబూ! ఈమాటు నన్నేకాదు, ఇం టిల్లిపాదినీ చంపేసేలావున్నారు. భీమారావు వచ్చి రెచ్చ గొట్టేడు. దానితో అభోజనం వుంటానన్న పున్నయ్య గాడు గరిట తీసుకొని అందర్నీ తరిమేసి వంటింటికి తాళం వేసేడు.

రాఘు : రెండు తన్నకపోయావా వెధవని.

నార : (విసుగ్గా) ఒరేయి! కాస్సేపు ఊరుకో, నీ పుణ్యముంటుంది. (రాజప్పతో) ఈవేళ నువ్వు బియ్యం పంపడం ఆలస్యం చేయడం చేతనే ఇంత పుట్టిమునిగింది.

రాజ : ఏదీ, బళ్ళని మిల్లుకు పోనియ్యకపోతే నే నెక్కడినుంచి బియ్యం తెచ్చేది?

నరస : (లోపలినుంచి వచ్చి) పదిగంటలకి ధాన్యం మిల్లుకుతోలి మాకు బియ్యం పంపుతావా? నీబోడిపెత్తనం ఇదేనా? ఇం టిల్లిపాదినీ చంపేస్తున్నావు. నీకు తగ్గవాళ్ళు వాళ్ళే.

రాజ : నారయ్యబావా! వాళ్ళఆస్తి నెత్తిన కొట్టుకోమను. నావాటా నాకు పంచి యిప్పించెయ్యి; నే పోతా.

నరస : (నవ్వుతుంది) కథ ఎమరుతిరిగించే. ఇప్పుడు పంపకం సులభమా?

నార : మీ తగువులు మండిరి. నా ప్రాణం తీస్తున్నారు. పంచుకు చావండి.

రాఘు : ఇప్పుడేం వద్దు. ఈమధ్య నాకేం బాగుండడంలేదు. నే నీ వ్యవహారాలు చూడలేను.

నరస : నీకు జబ్బుగావుంటే మందుచ్చుకో. ఇంతోటి వ్యవహారాలూ చూసేవాళ్లు లేకపోలేదు. (రాజప్పతో) తాళంచెవి ఇల్లా తే.

రాజ : మా ఆస్తి నువ్వు చూడక్కర్లేదు. మాది మాకు పంచెయ్యి.

నరస : అంత నిల్చున్నపాళాన పంచెయ్యడం తెమలదు. ఇన్ని ఏళ్ళ ఆదాయం, ఖర్చులూ లెక్కతేల్చుకోవాలి.

రాజ : లేదు. ఏ భూమిమీద ఆదాయం ఎల్లా వుందో, ఖర్చెంతో విడివిడిగానే లెక్కలు తయారు చేయించుతున్నా. రెండేళ్ళ క్రితం ఇంచుమించంతా పంపకాలు జరిగిపోయినవే

రాఘు : అది పనికిరాదు

నార : ఒరేయ్! ఏమిట్రా అల్లరి. ఇంక తెలివితక్కువ పేచీలు పెట్టక మీకు వచ్చే దేదో తీసుకో. పో. రోజూ ఇదో గొడవట్రా.

నరస : అయితే మేడిల్లు మా వాటాకి రావాలి. ఈ రెండేళ్ళూ మాకు తిండేనా పెట్టకుండా మాడ్చికట్టాడు. అది మాది.

రాజ : ఆ యింటివేపు కన్నెత్తితే మీసంగతి కనుక్కుంటా.

రాఘ : ఇన్నాళ్ళనుంచీ ఈయన వుండనేవున్నాడు. గనక మేం కూడా ఆ యింట్లో వుంటాం.

నార : నోరు మూసుకొని నే చెప్పినట్లు వింటారా, వినరా. ఇంక మళ్ళీ మీ వెధవ పేచీలు నే వినలేను.

నరస : ఈ పాడుకొంపలో శుభ్రమైన గదయినా లేదయ్యో. ఇన ప్పెట్టి ఎక్కడ పెట్టుకోవడం? ధాన్యంగాదె ఏది?

రాజ : మెడకి కట్టుకొని ఊరేగండి.

రాఘ: మా ఇనప్పెట్టి ఈ యింట్లో పెడితే ఎవరన్నా ఎత్తుకు పోతారు. అంచేత ఆస్తులన్నింటితోపాటు మేడకూడా పంచాలి.

రాజ : అంతగా ఏడుస్తే ఓ వెయ్యో, రెండువేలో పారేస్తాగాని చస్తే ఇంట్లో వాటా ఇవ్వను. ఏమోయ్ నారయ్యబావా! ఇప్పుడే చెప్తున్నా.

నార : పడనివాళ్ల ఓ యింట్లో వుండడం అంత పాడుపద్ధ తుండదు. మేడ వాటా లేదు ఏమీలేదు.

రాజ : అంతే.

నరస : నా మొగుడు అమాయక ప్పీనుగు కావడంచేత ఆయనకి పేడరాస్తున్నారు. నే నొప్పుకోను.

రాఘ : అమాయకుణ్ణవడంచేతనే నువ్వూ, మా తమ్ముళ్ళూ కూడా అల్లా పేట్రేగిపోయారు.

సుంద: నారయ్యబాబూ! ఈయనగారు ఇనప్పెట్టిని దక్కించుకో లేదు. ఆ తమ్ముళ్ల వాళ్ళనీ ఈయన నిభాయించలేదు.

రాజప్పమామగారిని గడగడలాడించేసినవాళ్లు ఈయనికి లొంగుతారా? మా పిల్లలంతా పసివాళ్ళు. వాళ్ళు పెద్దవాళ్ళయ్యేసరికి ఈ ఆస్తంతా ఎగిరిపోతుంది. కనక ఇనప్పెట్టె మీ దొడ్లో కట్టిన 'బొట్‌హౌస్' లో వుంచుకోనివ్వండి.

రాజ : ఇనప్పెట్టె అక్కడుంటేమాత్రం లాభం ఏం వుంది. ఆస్తి వాళ్ళదైనప్పుడు ఇనప్పెట్టె ఎక్కడున్నా ఒక్కటే. నే నొప్పుకోను.

నార : రాజప్పా! ఒక్కమాట చెప్తా వింటావా?

రాజ : మేడలో వాటాతప్ప అన్నీ వింటా.

నార : వాడు ఎంత చేతకానివాడైనా తమ్ముళ్ళ కొక విధంగా వాడంటే ఏదో అమాయకుడులేయని గౌరవం వుంది.

రాఘ : ఈ వెధవముండలు వినదుగాని మా తమ్ముళ్ళు మంచి వాళ్ళు. నామీద మహాగౌరవం.

సుంద: ఆ మంచితనం, గౌరవం బోర్డు ఎన్నికల్లోనే తెలిసింది.

రాఘ : అప్పుడేదో శీనయ్యా వాళ్ళా చెప్పుడుమాటలు విని అల్లా అయ్యేరు.

నార : మీ వెధవగొడవేనా, మమ్మల్ని మాట్లాడనిస్తారా?

రాఘ : చెప్పు చెప్పు.

నార : అందుచేత వ్యవసాయం వాళ్ళు చేసినా, వ్యవహారం, డబ్బు. దస్కం, పీడిచేతిమీదుగానే వెడుతుంది. అల్లాంటప్పుడు ఆడబ్బు ఇంట్లో ఎదురుగా వుంటే కన్నుకు

కొట్టేస్తారు. కనక ఆపెట్టె అవీ నీ యింట్లోనే వుంచు. ఏరా రాఘవా!

రాఘ : నిజమే. ఇనప్పెట్టె ఇక్కడే వుంటే మా తమ్ముళ్లు కొట్టేస్తారు.

రాజ : చావనును. విడిపోయాక వాడే యేట్లో దిగితే నాకేం?

నార : తెలిసినవాడివి అల్లా అనడం బాగాలేదు. నీ గదికి అద్దె యిచ్చేటప్పుడు తీపుతీసిందా?

రాజ : నలుగురూ వస్తూ పోతూండడానికి నా యిల్లేం సత్రవా? ఆడవాళ్లున్న ఇల్లు కాని........

సుంద: ఆయన మగతనం!

నార : అన్నకొడుకు దగ్గిర ఘోషా ఏమిటోయ్! మరోమాట వద్దు. వాడినీ, వాడి చిన్నపిల్లల్నీ చూసి........

రాఘ : ఔను బాబాయ్!

నరస : మన వాటాలోకి రావలసిన యింట్లోగది అద్దెకివ్వడాని కేనా ఇంత ఏడుపు.

రాజ : వీళ్ళు చూడు, ఎల్లా తిడుతున్నారో. వీళ్ళకి నా యింట్లో చోటిస్తే నన్నే వీధిలోకి గెంటుతారు.

రాఘ : ఆ పాడుముండ మాటకేంలెద్దు బాబాయ్!

రాజ : అంతేలే. అది ఏడ్చావంటే ఏడ్చినట్లూ, చచ్చావంటే చస్తానా? శివుడి ఆజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు.

[కోలాహలంగా భీమారావు దారి చూపుతోంటే నలుగురు కూలి వాళ్ళు ఒక బీరువా తెస్తారు.]

భీమా: మీరు తప్పుకోవాలి. లేవండి. (రాజప్ప, నారయ్య, సుంద రమ్మ, నరసమ్మ, రాఘవయ్య చెట్టుకేసి తొలుగుతారు.) అల్లాకాదు. బీరువా అక్కడే పెడతారు, ఇటురాండి. (పెడ తారు.) ఇల్లా పెట్టండోయ్. (కూలీలు పెడతారు.)

రాజ : ఇది నా బీరువా. సు వ్వెత్తుకొచ్చినట్లు పోలీసులతో రిపోర్టు చేస్తా.

భీమా: ఇదిగో నే చెప్తున్నా విను. పోలీసులు.గీలీసులు అన్నా వంటే నిన్ను పీక నులిమేసి నూతిలో పారేస్తా. ఊళ్ళో నలుగుర్నీ ఎదట పెట్టుకొని కర్రసామాను, ఇత్తడీ సామాను వాటాలు వేయించేశాను. నీవి నీ కొడుకు తీసు కున్నాడు. మావి తెప్పించేసుకొంటున్నా. తెలిసిందా? ఒరేయ్! అన్నయ్యా! నీ గది సవరించు. బాబయ్య వెళ్ళి మన ఇనస్పెట్టి పంపుతాడు.

నార : ఈ బొళ్ళ కొంపలో ఇనస్పెక్టెట ఎందుకు? అక్కడ వుంచడానికి మీ బాబాయి ఒప్పుకొన్నాడు.

రాజ : నే నొప్పుకోలేదు.

భీమా: నీ వొప్పిస్తావనుకొంటా. ఏం మామా! పెద్దవాడివని పెత్తనం వదిలినందుకు నువ్వు పెట్టిన పేచీలు చాలు. నువ్వింక కలగచేసుకోవద్దు. ఏం తెలిసిందా?

నార : నా తెలివితక్కువగాని మీకోసం నేను ఏడవడం ఎందుకు? తిట్లు తినడం ఎందుకు?

భీమా: అదీ! నీతిగల వా డనవలసిన మాట.

నార : ఔను నాయనా! అంతే; నాకెందుకు (వెడతాడు.)

రాఘ: నేనూ వస్తున్నా మామా! (పోబోతాడు)

భీమా: ఒరేయ్! నీకు ఆయనగారు అన్నం పెడతాడనుకుంటున్నావేమో. ఒక్కపూట ఇన్ని కాఫీనీళ్ళుకూడా ఇవ్వడు. వచ్చి నీ గది ఖాళీచేసి ఇస్తావా? మూటా ముల్లెతో వెళ్ళిపోతావా?

రాఘ : (ఆగుతాడు.)

భీమా: వె ళ్ళింట్లోకి.

రాఘ : (పిల్లిలా ఇంట్లోకి వెడతాడు)

భీమా: (వదినెలతో) మీరు నాల్రోజులు మీ సామాను కాస్త సావిట్లో పెట్టుకోండమ్మా! మీ గదుల్లో ధాన్యం పొయ్యాలి. కట్టించినాక గదుల్లోకి సర్దుకొందురుగాని....

నరస : నేను నా గది ఇవ్వను.

భీమా: గౌరవంగా చెప్తున్నా. వినకపోతే వూరుకోను. ఇంతవరకు పెద్దవాళ్ళని మీకు వదిలేశా. మా గడ్డి మాకు పెట్టేరు. తీస్తావా తియ్యవా?

సుంద: నే తీస్తా (వెడుతుంది)

నరస : నువ్వే తీయించుకో. (వెడుతుంది)

భీమా: బాబాయ్!

రాజ : ఊ.

భీమా: ఆస్తులు, అప్పులు, నిలవ, దస్తావేజులు సమస్తం సాయం కాలానికి తేలిపోవాలి; వింటున్నావా?

రాజ : విన్నా.

భీమా: అదేదో పూర్తి అయ్యేకనే పున్నయ్య వంటింటితలుపు తీస్తాడు. నీకు అన్నం కావాలంటే ముందు మా వాటా మాకు పారెయ్యి.

రాజ : ఒక్కగంటలో అన్నీ తేలిపోతాయి; కాని........

భీమా: కానీలేదు, గీనీలేదు. ఆపని తేలేవరకూ మంచినీళ్ళు కూడా తాగనివ్వను.

[ రాజప్ప వెడతాడు ]

భీమా: నడవండిరా. మిగిలిన సామానుకూడా పట్టుకురాండి.

[ అందరూ వెడతారు. ]

[తెర]



# ప్రజా జీవితాన్ని ప్రతిబింబించే

## నాటకాలు, నాటికలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పేదరైతు | కొడాలి గోపాలరావు | రు. | 1 | 0 | 0 |
| కూలీ | ,, | | 1 | 0 | 0 |
| శాంతి సందేశం | ,, | | 0 | 6 | 0 |
| అగ్నిపరీక్ష | ,, | | 0 | 8 | 0 |
| ఆకలిచావులు | ,, | | 0 | 4 | 0 |
| ఉమ్మడికొంప | రామమోహన్ | | 0 | 12 | 0 |
| ఇదా స్వతంత్రం? | పడాల | | 0 | 12 | 0 |
| మారేలోకం | ,, | | 0 | 12 | 0 |
| సందేశం | ,, | | 1 | 4 | 0 |
| పేవ సంసారం | రంగారెడ్డి | | 1 | 4 | 0 |
| నేటి న్యాయం | బి. ఈశ్వరుడు | | 1 | 4 | 0 |
| ఆశాంతి | భూషణ్ బాబు | | 1 | 8 | 0 |
| స్వతంత్రభేరి | | | 1 | 4 | 0 |
| ధర్మదీక్ష | | | 1 | 0 | 0 |
| శిక్ష | పిట్టాల | | 1 | 0 | 0 |
| రైతుభూమి | సూరి | | 1 | 8 | 0 |

